శ్రీ

# హరశతకము

గ్రంథకర్త


కవిరాట్టు హనుమత్కవి,

అన్నపర్రు

బాపట్ల తాలూకా, గుంటూరు జిల్లా.





మొదటి కూర్పు 1000.

విజయ ముద్రాక్షరశాల, బాపట్ల.

1934.




[వెల రు. 0—4—0.

# పండితాభిప్రాయము.



చం॥ సరస వచఃప్రసూనముల
శంకరు పాద సరోరుహంబులన్ ।
వరమతిఁ బూజలన్ సలిపి
వాసియు వన్నెయు గాంచినావుఁ డు ।
స్తగ శతకప్రయుక్త గుణ
సార రసోదయ భావసంతతిన్ ।
ధర వెదఁజల్లినాఁడవు వి
నమ్రిత ధన్యుఁడనైతి నంతయున్ ॥

కం॥ కవిరాడ్వంశోద్యానో
ద్భవ పరిమళ సుమవికసిత పాదప మనఁగా
కవితా నవరసకళ ను
ద్భవమైతివి హనుమయాఖ్య ప్రాభవ మొసఁగన్॥

కం॥ ధారాళకైతయొప్పను
హేరాళ విరాజమాన హృద్వ్యాపార
స్ఫారసుధీరస శక్తియు
నారయఁదగు శతకమందు నమలగుణాఢ్యా ॥

చం॥ స్థిరమగు భక్తిబీజము
సుధీస్తుతిపత్రము, జ్ఞానమూలముల్
విరసువదప్రసూనము ల
వారితబోధ సుధానువాసనల్
అరయ విమోహ ముక్తిఫల
మై సముదంచితవంతమౌచు నీ
హారశతకంబు వర్ధిలఁగ
నా సురభూరుహ రాజముట్లిలన్ ॥

కం॥ తారాశశి బ్రిధ్మాంశులు
కారుణ్యమెలర్ప దివిజతలమున వెలుఁగన్
ఘోరాఘదూర శతకము
ధారుణి బుధవినుతమై తదధికత వెలుఁగున్ ॥

బాపట్ల
1—4—34.

యడ్లపాటి వెంకటసుబ్బారావు,
బి. యే., బి. యల్.,
జిల్లాకోర్టు ప్లీడరు.



# పండితాభిప్రాయము.

చం॥ జిలిబిలివాక్యముల్ సుధలుజిల్కు నవీనములైన శ
బ్దములీ ! కలితకలాకలాపములఁ గ్రాలుమృదూక్తుల
పూర్వభావముల్ । లలితలస న్మిళిత్ప్రతిభలన్ బ్రస
విల్లెడుముద్దుముద్దువ । ల్కులు దోలుకాదుమీకవి
తకున్ మనసొగ్గని వారలుందురే ॥

ఉ॥ పుట్టుకతోడనే కవితపుట్టదుఁ గాకప్రయత్న పుంగళన్
బట్టినమాత్రనే లసదలంకరణ ప్రతిభప్రభావముల్
బుట్టునె? కాకిఁ బంజరములోనిడి కూడిడిపెంచుచున్న
నా । కట్టుబెగాకఁ జిల్కవలెఁ గమ్మనిపల్కులఁ బ
ల్కనేర్చునే ॥

ఉ॥ పన్నయభట్టువ్యాకృతి మనంబున నిత్యముగొగ్గుగా
కనా । చిన్నయసూరి సూత్రములు చిత్తభవంబగు
గాకఁబూర్వపుం । బున్నెములేనిచోఁ గవితపుట్టదు
పుట్టినగిట్టదల్లుగా । కున్నమనీషు లెందఱిలనూరును
బేరునులేకపోవుటల్ ॥

చం॥ ప్రమదమొసంగదెవ్వరికి? బాపురె భక్తిరసప్రధానమై
సమరసభావ సంకలితచారు తరంబయినట్టి మీకవి
త్వమను సుధారసంబెడఁదఁద్రాగినచో కవిరాట్కులా
బ్ధిచం । ద్రమ! హనుమత్కవీంద్ర! కవిరాజవిరాజిత
పూజతాగ్రిణీ ॥

రా వి పా డు.
9—2—34.

ఇట్లు, మిత్రుడు,
ఖాసిం ఆలీషాకవి.
నేటీవ్ డాక్టర్.

# ఉపోద్ఘాతము.



చదువరులారా!

ఆంధ్రభాషా వాఙ్మయ ప్రపంచమున బ్రకృతము నం దెన్నియేని శతకములు ప్రకటితము లగుచున్నయవి, నన్నయభట్టారక కవీంద్రుని కాలమునుండియుఁ బదునెనిమిదవ శతాబ్దారంభమువరకుఁ బ్రబంధములతోఁ బాటు శతకరచనగూడ సాగుచుండెడిది. ఈకాలమున శతకరచన విరివిగా ప్రచారము నందున్నను భక్తిజ్ఞాన వైరాగ్య మోక్షములకును నీతికిని నాలవాలమై యుండకుండుటంబట్టి శతకరచన సన్నగిల్లిన దనుటయే సర్వోత్కృష్టము. ఈవిషయమును దృష్టియందుంచుకొనియేకాబోలును మనకవిగారీ హారశతకమును రచించిరి. ఈహారశతకము ఆధునికకాలమున ప్రఖ్యాతాంధ్రకవులచే రచియింపంబడిన సుమతి, భాస్కర, నృశింహ, కాళహస్తీశ్వరమున్నగు శతకములతో నీశతకమును బోల్పవచ్చుననుట, అతిశయోక్తి కాజాలదు. ఇందనేకనీతులుఁ గన్పట్టుచున్నయవి. భక్తిభావములు వెలయుచున్నయవి. జ్ఞానవైరాగ్యములు సూచించుచున్నయవి. వేదాంతార్థ ప్రతిపాదకములగు మోక్షోపాయము లుల్లసిల్లుచున్నయవి. మొత్తముమీద నీహారశత

కవము సర్వలక్షణసమన్వితమై, లలితమై, ద్రాక్షా పాకము న వెలయుచు, సర్వమతములవారికిని, సర్వవర్ణములవారికి ని, నిత్యముఁ ద్రికాలములయందుఁ బారాయణ జేసికొను ట కుపయోగింప నర్హమగుచున్నయది యనినంజాలును

—: శతకప్రశంస నిటఁగొంతవిమర్శింతము :—

(౧౨) (౨౬)వ పద్యములలో కవిగారు నిగర్వచూడామ ణులని తెలుసుకొనవలసియున్నది. (౪౮)వ పద్యమువల న యోగాభ్యాస పరాయణులనియుఁగూడ దెలిసికొనవల సియున్నది ఏలయన ప్రకృతికిలోఁబడిన సరస్వతీవీణాగా నమును, శ్రీకృష్ణుని వేణుగానమును, పికాంగనగానము ను, భృంగాంగనగానమును, మేఘగానమును, ప్రకృతాతీ తమగు ప్రణవగానమునకుసరిరావని యనుభవనీయులగు నీకవిగారి భావమని నానమ్మకము''ప్రణవగానమును గు రించి మాపూర్వులచే వ్రాయబడిన మోక్షసారము అను తాళపత్రగ్రంథమున నీక్రిందివిధముగా లిఖయింపబడి యు న్నది. యోగవిద్యా విశారదులగు మహనీయులకుశ్రవణ పుటములందు,(౧)తొలుత చిరుగజ్జలనాదమువలెనుఆవెనుక [౨] గొప్పగజ్జల నాదమువలెను పిమ్మట వినగావినగా (3)గంట (౪)శంఖము (౫)వీణ (౬)తాళము (౭)పిల్లనగ్రోవి (౮) మృదంగము (౯)భేరీ (౧౦)మేఘము (ఓంకారము) అనగా ప్రణవనాదమునందీ దశవిధనాదములు వినంబడునని

యును ఇందలితొమ్మిదినాదములను పరిత్యజించి పదియవ ప్రణవనాద మభ్యసించిన నయ్యది మోక్షమునకు హేతుభూతమగుననియును, ఈప్రణవనాదము, అకార, ఉకార, మకార,ములు మూడుంగూడి ప్రణవరూప (ఓం)మగుననియును అయ్యది అనాహత చక్రమునందుబుట్టి అచ్చటనుండి ప్రజ్వరిల్లి కపాలమునందు (సహస్రారకమలమునందు) మహాధ్వని జేయుచుండు ననియును. అయ్యదిసాధనపరులగు మహనీయులు వినుచునిత్యానందముఁ బొందుచుండుదురనియునుఁ దెలుపంబడియున్నది.

—♦ ఇందుకుఁబ్రమాణము. ♦—

శ్లో॥ అనాహతస్య శబ్దస్యతస్య శబ్దస్య యోధ్వని।
ధ్వనిరంతర్గతంజ్యోతి జ్యోతిరం తర్గతంమనః
తన్మనోనిలయంయాంతి తద్విష్ణోః పరమంపదం॥

యోగియన ముక్కు—చెవులు మూసికొన్నంతమాత్రమున కానేరడు, ప్రణవనాదమును వినుచు నానందించుచు నానంద స్వరూపుని నెల్లపుడు నెల్లెడలఁగాంచుచుఁ సర్వజీవులను భగవద్రూపులుగాఁ బ్రేమించుచుండునట్టి మహనీయులే యోగులనం బడుదురని

[౧౫]వ పద్యమునందు సృష్టిక్రమమునకు గర్తలందెలుపంబడియున్నది. బ్రహ్మతండ్రి విష్ణువు, విష్ణువు తండ్రి, రుద్రుడు, రుద్రునితండ్రి మహేశ్వరుడు, అనగాఁ

బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, అను త్రిమూర్తులకుం బూర్వుండైనట్టివాండొకండు గలండనియును వాతడే సదాశివుండు (పరశివుండు) అనియును, అట్టివాడవాఙ్మనసగోచరుండనియును నయ్యదియే జ్యోతిర్మయ శివలింగస్వరూపమనియునుం దెలిసికొనం దగియున్నది.

ఈ భావమునే శ్రీశంకర భగవత్పాదాచార్యులవారు సౌందర్యలహరియందిట్లు వెలిఁబుచ్చియుండిరి.

శ్లో॥ జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే।
తిరస్కుర్వన్నేతత్ స్వమపి వపురీశ స్థిరయతి।
సదాపూర్వ స్సర్వం తదిదమనుగృహ్ణాతి చశివ!
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయో ర్భ్రూలతికయోః॥

ఇట్టిభావమునే మన బమ్మెర పోతనామాత్య కవీంద్రులవారు శ్రీమదాంధ్ర మహాభాగవత పురాణమునందు గజేంద్ర స్తవమునను గూడ "లోకంబులు లోకేశులు" అను కందపద్యమునం దిమిడ్చియుండిరి.

(౯)వ పద్యమునందు (బ్రూ)కారమును (౧౮)వ పద్యమునందీ కవిగారు (శ)కారమును బ్రయోగించియుండిరి. (అ)కారాది (క్ష)కారాంతముగాం నక్షరానుక్రమముగా వ్రాసియుండుటచే (హా)యనుట నమస్కారముగా నుండ (బ్రూ)యను వర్ణముం జేర్చియుండిరి. (శ)కారమును కవికుమారులెచ్చటను బ్రయోగించినటులఁగాన్పింపదు కాని, మన యీకవిగారు స్వతంత్రించియుండిరి.

ఈశ్వరుని పదమునకును పాదమునకును (శ) కారోపమానమును నిరూపించియుండిరి.

(౧౧౨)వ (౧౧౩)వ పద్యములయందు ద్వివిధములగు బాహ్యాభ్యంతరార్థములు వెలయుచున్నయవి.

(౭౨)వ పద్యమునందు త్తమభక్తుల లక్షణములు విశదమగుచున్నయవి.

(౧౦౭)వ పద్యమునందుఁ దివ్యమూర్తులయొక్క యాధిక్యమును, జ్యోతిర్మయ శివలింగమూర్తియొక్క ప్రభావమును, శ్రీమహాశివరాత్రి నిర్ధారణములును, వివరింపఁబడియున్నయవి, ఈశతకరచనమద్వైతపరముగా నుండుటంబట్టి కవిగారు (౪౭, వ, పద్యమునందు- విష్ణుపరమగు- కంజపద కంజలోచనయను పదములును- అచ్చటచ్చటఁగూడా మరిఁగొన్ని పద్యములయందు విష్ణుపరంబగు పదములును, ఈశ్వరపరముగాఁ బ్రయోగించియుండిరి,

(౧౦౯)వ, పద్యమునందు శివకేశవాఽభేదమును విశదీకరించి యుండిరి,

వీరి కవితాకుమారి సర్వజనమనోహారిణియై, సరస కవిజనానంద దాయనియై, సకలపాపహారిణియై, పండితపామర పఠనీయయై, యలరారుచున్న యదియని త్రికరణశుద్ధిగా విన్నవించు,

సూరిజనవిధేయుఁడు,

బాలకవిసింహ్వ అవ్వారి సుబ్రంహ్మణ్యశర్మ

వంగిపురము, 4—2—34,

———

# విజ్ఞాపనము.

—••❖••—

అచ్చులోపములతోఁబాటు నాలోపములఁగూడ క్షమియించి దయతోఁదెలిపిన రెండవ కూర్పున సవరించుకొనెద.

అన్నవరము.
శ్రీ భావ సం॥
చైత్ర శుద్ధ పూర్ణిమ

గ్రంథకర్త.

కం. శ్రీ నర్సమాంబ తల్లికి

మానాయన శివయశర్మ మాకులదైవం

బౌ నావిశ్వేశ్వరునకు

నే నంకితమిత్తు భక్తి నీశతకంబున్.

శ్రీ

# హరశతకము.

శ్రీకర కరుణాకర పర
భీకర వరముద్రికర గభీరా ధీరా
లోకధరా లోకభరా
లోకహరా చతుర చతురలోకుండవు హరా. ౧

క॥ అసమాన సమాన సమా
నసమానసభోధ రసఘనార్చితగరళ
గ్రసనామృగ వసనాహృత
వ్యసనాదరహాసన పరశిచారమణ హరా. ౨

క॥ ఆడంగల విందప్రిజాలకుం
డాడెండుచందమున జగములన్నింటిలోనీ
వాడం జరాచర జాలము
లాండెడుం గదజనన మరణమందుచును హరా. ౩

క॥ ఇరుమూండక్షరములనీ
వరనామము వినుతిసేయు వారలదెసగిం
కరులర్ బోవల దనియముం
దుశ్శాసన మిడెనటందు శ్రుతులుహరా. ౪

క॥ ఈరేడు జగమ్ములలో
నేరీ నీసాటివేల్పు లెందుఁ వెదకఁగ
లేరో దారిద్ర్యవనకు
ఠారా కామహర కుక్కుటాకార హరా. ౫

క॥ ఉరగాధినాథ కంకణ
పురుషోత్తమ దేవదేవ పూజితచరణా
పరిపూర్ణానంతగుణా
పరిపూర్ణానంద నటన పరిపూర్ణహరా. ౬

క॥ ఊరేదియొ యునికేదియొ
పేరేదియొ తల్లిఁ దండ్రి పిల్లలు మఱియే
దారిఁ దనవారైరో
వారే గదరెటఁగో? తెలియ వశమా నె హరా. ౭

క॥ ఋషులుఁ ద్రిమూర్తులును వని
మిషులుఁ రవిచంద్రులుఁ సమీరాదికముఁ
దుషితుల్ దశదిశలుఁ బూ
రుషులుఁ యువతులును నీదురూపములె హరా. ౮

క॥ బూపితలోకాలోకా
దీపిత బ్రహ్మాండభాండ దివ్యశరీరా
తాపసనుతచరణా నం
తాపానలహరణ గిరిసుతారమణ హరా. ౯

కం॥ ఇకలుక బురువులుబడ వే
వికటముగానీదుభక్త వితతికినెగ్గుల్
జకబికిసేయుచు దూఱుచుఁ
పకపకనగువారినోటఁ బరమేశహరా. ౧౦

కం॥ శాటీలుఁజారుకుఁ గొఱుకుదు
నాటుల్ కోటులును బుడ్డలడ్డఘగడ్డల్
దీటల్ పొడనీతుడు వెల
కోఁటుల గూటములఁగేరు భోగులకు హరా. ౧౧

కం॥ ఎఱుఁగను జపతపయజ్ఞము
లెఱుఁగనుయాగాదికర్మ లెఱుఁగనుమంత్రం
బెఱుగను దానముధర్మము
లెఱుఁగనుయోగంబునిన్నెఱుఁగుదునుహరా. ౧౨

కం॥ ఏలితిముల్లోకము లన
జాలితినిన్భక్తిఁగొల్వఁ జాలినకతనన్
సోలితి బ్రితిమాలితి బిగిఁ
దూలితిఁగిల్బిషముఁ బారఁదోలితిని హరా. ౧౩

కం॥ ఐశ్వర్యప్రదయాది మ
హేశ్వరయోంకారరూప హితరతశంభో
విశ్వాత్మ విశ్వవందిత
విశ్వాశ్రయవిశ్వరూప విశ్వేశ హరా. ౧౪

క౦॥ ఒకలింగమునకుఁ బరశివుఁ
డొకపరశివునకును రుద్రుఁడొకరుద్రునకున్
ఒకవిష్ణువు విష్ణువునకు
ఒకబ్రహ్మజనించి జగములొనరించె హరా. ౧౫

క౦॥ ఓన్నమశివ యోన్నమశివ
యోన్నమశివయనుచు నోటనుచ్చారణ సే
యన్నరని మానవులిల
నున్నన్ గనుటిజన్మ రెండు నొక్కటియె హరా. ౧౬

క౦॥ జౌరాగరళము మెసవితి
వౌరాయనిజగములెల్ల నానందింపన్
ఔరాయని హరమెచ్చఁగ
నౌరాయనిబ్రహ్మరెప్ప లల్లార్చ హరా. ౧౭

క౦॥ అంగజ గర్వవిభంగా
శృంగారరసప్రసంగ సితరుచిరాంగా
మంగళ వృషభతురంగా
సంగీతకళాంతరంగ సాంబశివ హరా. ౧౮

క౦॥ అప్పదమ తీతమవ్యయ
మెప్పగిదినిజేర్చెదో మహేశ్వర నను మా
యప్పా నవరత్నంబుల
కుప్పానప్పుధరనిన్ను గొల్చెదను హరా. ౧౯

కం॥ కనికానక నొనరించిన
మనసేంద్రియచిత్తబుద్ధి భావప్రకృతిన్
దనువాక్కర చరణంబుల
ఘనదురితము లెల్లఁ బాపి కాపాడుహరా. ౨౦

కం॥ ఖరమే మేలగుగాశం
కరుపదములఁగొలువలేని కాపురుషునితో
సరిపోల్చిచూడఁగా శం
కరిహృదయ సరోజభృంగ కరివరద హరా. ౨౧

కం॥ గజదనుజ గర్వఖండన
త్రిజగద్వ్యాపిత యశోవిదితమండన సా
మజసేవిత యజభావిత
భుజగాభరణా త్రినయన పూజితుఁడ హరా. ౨౨

కం॥ ఘనగంభీర రవంబున
బనివడిభక్తావళినెల్లఁ బాలించెద నం
చనిపల్కిన భాషణములు
ననుమానంబగుచుఁ దోఁచెననుదినము హరా. ౨౩

కం॥ న్యాయాన్యాయ విచక్షణ
శ్రీమోదాయకమహాత్మ చిన్మయరూపా
మాయాగుణ గేయా సుర
రాయా మహానీయనన్ను రక్షింపు హరా. ౨౪

క॥ చరణంబులు లోకహితా
చరణంబులు హరివిరించి శక్రాద్య మర
స్మరణంబులు భవభయముల
హరణంబులు నమ్మి కొల్తు నహరహము హరా ౨౫

క॥ చదువను వేదము శాస్త్రముఁ
జదువను పురాణములను జదువుల మర్మం
బది మొదలేమది నెఱుఁగను
గదసదయుతనన్ను నెల్లుగాచెదవో హరా. ౨౬

క॥ ఛందోగణ సుస్వాంతన
సుందరవన లతా వాక్ప్రసూనంబులచే
నందింపఁజేయు నవరస
కందాష్టోత్తర శతమ్ముఁ గైకొమ్ము హరా. ౨౭

క॥ జగతిన్ బుట్టెడుఁ జచ్చెడు
నగుఁబాటగు తనువునొల్ల నానాగతులన్
దిగులొంది కంది కుందితి
వగజెందితి బుట్టులేని వరమిమ్ము హరా. ౨౮

క॥ జాలిగలదేవుఁడని నీ
పాలంబడి వేఁడుచుంటి పాలింపుకృపా
లీలాగమ మూలాతి ను
శీలా కరుణాలవాల శివదేవ హరా. ౨౯

కం॥ ఝుణుతక తధిగణతోం తక
ఝుణుతక ధిమిధిమిత తధిమి ఝుంతరి కిటతోం
ఝుణుతక శబ్దములడరఁగ
ఝుణుతకయని తాండవంబు సల్పెదవు హారా. ౩౦

కం॥ ఇణిణిణిణిమ్రియటంచున్
ఝుణుఝుణుఝుణుఝుమ్మటంచుఝుంఝుమ్మని ని
ర్గుణ యోగులకున్ శ్రవణ
ప్రీణనసునాదం బనేకభంగులగు హారా. ౩౧

కం॥ టక్కులకుఁ బరమపదమన
జిక్కనిదక్కని యశంబుచేకూడుని మా
దిక్కగుము శంకరాయని
మ్రొక్కెడుభక్తులకెగాక ముక్కంటిహారా. 3౨

కం॥ తావుల్ దవ్వుచుఁ బ్రాణము
లేవేళనొ లేచిపోవు నీదేహముకున్
స్థావరముల్ గావనుచున్
జీవములుండఁగనె నిన్ను సేవింతు హారా. 33

కం॥ డమరుకపాలము ఖట్వాం
గమును త్రిశూలాక్షమాలికా మృగములోగిన్
సమయానుకూలముగ హ
స్తములనుదాల్చెదుమహాత్మ! శాశ్వతుఁడహారా, ౩౪

కం॥ ఢక్కాభేరీదుందుభు
లక్కజముగ శంఖకాహళాది రవంబుల్
పిక్కటిలి దిశలు మ్రోయఁగ
మక్కువనాఁడెదవు జగము మనుచుటకు హరా. ౩౪

కం॥ ణాణణకింకిణియను పద
మాణిక్యములడరనాఁడ మద్దెలహారియుణ్
వీణను వాణియు తాళము
వాణీపతి మేళవింప వాంఛింతుఁ హరా. ౩౫

కం॥ తనుఁదాగనుదారి మహా
ఘనమై కమనీయమై ప్రకాశిలుచుండుణ్
దనుదాఁగనుదారిని దా
మనుదారి నెఱుంగువాఁడె మానవుఁడు హరా. ౩౬

కం॥ స్థావర జంగమ మానవ
దేవాసుర యక్షగరుడ దినకర శశి పా
రావారా సర్వభువనము
లీవేవివి భువియుఁ దార లిహంబరము హరా. ౩౭

కం॥ దయగలవాఁడవు వరదా
భయకరుఁడవు భక్తహితుఁడ వాద్యుఁడవు జగ
త్త్రియ కారణభూతుఁడవు
నయనత్రయశోభితుఁడవు నందీశ హరా. ౩౮

క॥ నతలోకావన దక్షున
తతపండిత భక్తరక్ష దానవశిక్షా
తతశృంగా రాంగా వ
ర్యత శృంగాగ్రస్థ సౌధవాసుఁడవు హరా. ౪౦

క॥ పారావార గభీరా
సారాచారారివీర సర్వాహారా
ధారాధర నిభకంధర
ధారాధరతారహార ధారుఁడవు హరా. ౪౧

క॥ ఫలపత్రింబుల కమలో
త్పలముల మల్లికలబిల్వదళముల గంగా
జలములచేఁ బోలుపారఁగఁ
గలకాలమునీకుఁ బూజఁగావింతు హరా. ౪౨

క॥ బలవదరాతి విభంగా
విలసితధరణీశతాంగ విమలశుభాంగా
జలరాశి నిషంగా మం
జుల వృషభతురంగ కరుణఁజూడుముర హరా. ౪౩

క॥ భయదాట్టహాసభాసుర
లయకాలమహోగ్రహా కళావిగ్రహా పా
లయ మానతాళగీత ను
లయరంజిత తాండవిత విలాసపద హరా. ౪౪

కం॥ మనిచితివి సర్వలోకము
లనలజ్వాలా మహోగ్ర హాలాహల మీ
వునిచితివి కంఠబిలమున
నినునమ్మినవారిఁ నేలనేర్పరివి హరా. ౪౫

కం॥ యమనియమ మహాప్రాణా యా
మము లేక మనంబుదృష్టి మార్గముదోలఁగున్
యమనియమ మహాప్రాణా యా
మములన్నియు నీదుభక్తి మార్గములె హరా. ౪౬

కం॥ రంజన బుధరంజన యరి
భంజన కంజాసనాది వరసురవినుతా
కంజపద కంజలోచన
కంజానన కంజగాత్రి కంజగళహరా. ౪౭

కం॥ వనజోద్భవ సతివీణా
ఘనగానము కృష్ణవేణుగానమును పికాం
గన గానము భృంగాంగన
ఘనగానములెనయె ప్రణవగానముకు హరా. ౪౮

కం॥ లలితోజ్జ్వలసౌఖ్య లస
ద్విలసిత శోభాప్రభావ విదితానందా
జలజభవాచ్యుత సన్నుత
సలలిత పాదారవింద చంద్రధర హరా. ౪౯

కం॥ పారద నారద శరదర
సారస తారాభ్రధార సారతుషారా
శారద మరాళచందన
నీరద కర్పూరకుంద నిభగాత్ర హరా. ౫౦

కం॥ షణ్ముఖజనకా విధిసుర
రాణ్మకుట కిరీట రత్నరాజితచరణా
మృణ్మయ లింగాకార, హి
రణ్మయ లింగస్వరూప రామేశ హరా. ౫౧

కం॥ సారంగధర సుసన్నుత
సారంగాంకధర రుచిర సారంగకరా
సారంగ మోక్షదాయక
సారంగ నినాదప్రణవ సారంగ హరా. ౫౨

కం॥ హరిహర నిర్గుణరూపా
పరిపూర్ణానంద యోగి పాలకలాపా
శరణాగత భరణాతత
కరుణాకర కరుణజూచి కాపాడు హరా. ౫౩

కం॥ ళాకృతియగు నీపదమతి
ప్రాకృతులగువారికెట్లు ప్రాప్తిలనా పూ
ర్వాకృతముగాక నాద్యం
తాకృతిశూన్యంబు మధ్యనణువగుట హరా. ౫౪

కం॥ తురుడతురుడవు బాహ్యాం
తర మాయాశూన్యుఁడవు చిదానందుఁడవుర్
వరయోగి యోగముద్రిత
కరుఁడవు బ్రహ్మాంబవీవెశద మదనహరా. ౫౫

కం॥ వందిత సురనందిత వర
నందీశ్వర దంతవక్త్రి నగజాసహితా
కుంద ప్రభచంద్రనిభా
చందన నిభభూతిగాత్ర సర్వజ్ఞ హరా. ౫౬

కం॥ దుస్తర సంసారార్ణవ
విస్తర భయదాపహరణ విస్తీర్ణకృపా
ర్ద్రిస్తవను స్తుత్యపదా
వ్యస్త పదాస్వస్తపదద, వాస్తవ్య హరా. ౫౭

కం॥ అద్రిసుతా హృద్రాజిత
భద్రయశోల్లసిత రావ్య పర్వత నిలయా
రుద్రాఘన రౌద్రా వర
ముద్రా కరుణాసముద్ర ముద్రుఁడవు హరా. ౫౮

కం॥ గతినీవేయని బ్రతిమా
లితిరా నతిసేతురా లలిత రతికామా
నుతనామా హిత భీమా
ద్యుతధామా శ్రితలలామ భూతేశ హరా. ౫౯

కం॥ గుణశోషా గుణతోషా
గుణభీషా లోకపోష గురుతరభాషా
ఫణిభూషా మునివేషా
మణిఘోషాన్విత సుచరణ మంజునట హరా. ౬౦

కం॥ సుగుణాశ్రిత శమనాంతక
నిగమాగమచరిత కీర్తనీయ గుణాఢ్యా
నగనాపగాధరాయో
నగరాజ తనూజవినుత నగచాప హరా. ౬౧

కం॥ వారణ చర్మాంబరధర
వారణదురితౌఘ ఘననివారణ పవనా
ధీరా ఫణిహారా గం
భీరా ధవళితశరీర పింగాంక హరా. ౬౨

కం॥ రావా భక్తులఁ బ్రోవఁగ
లేవా నీవాఁడఁ జేఁడ లేలెమ్మరహో
దేవా పరదేవా శివ
దేవా దేవాదిదేవ దేవేశ హరా. ౬౩

కం॥ రారా ననుమన్నించర
రారా నన్నేలుకోర రారహర హరా
రా రాయని నోరూరఁగ
పారాయణఁజేతుఁ బంచవర్ణముల హరా. ౬౪

కం॥ భూతాధిప సురసేవిత
నేతానిగమాది వినుతనీయచరిత్రా
మాతాహిత త్రాతాపిత
భ్రాతాయనినిన్నసతము భజియింతు హరా. ౬౫

కం॥ రూపవయో విలసనముల
దీపించెడు సతుల రతులఁ దేలి జడుఁడనై
నీపదము లాశ్రయింపని
నాపయిఁగోపంబుమాని నన్నేలుహరా. ౬౬

కం॥ బోటుల చనుఁబోటులఁబడి
పాటవమింతైన లేక బడలిన వక్షో
పేటిక భక్తి సుబీజము
నాటించితి విఁతినిరతినటనరత హరా. ౬౭

కం॥ సర్వజ్ఞా నిర్వాహక
సర్వజ్ఞా సర్వశూన్య సర్వేశభవా
సర్వాహిత గర్వహరా
శర్వాణీప్రాణనాథ శాశ్వతుఁడ హరా. ౬౮

కం॥ హాలాహలోజ్జ్వలానల
కీలాజాలములగ్రోలి కీర్తిగనుకృపా
శీలా సువిశాలా సుర
పాలా కరుణాలవాల పాలింపు హరా. ౬౯

కం॥ ఆశాపిశాచమంటినఁ
నీశుండేదూరుఁడగును నిహపరములకున్
ఆశాపిశాచమడఁగిన
నీశుండై వెలయునీచుఁ డేనియును హరా. ౨౦

కం॥ అమలాప్స రసలఁగూడిన
నమరేంద్రుఁడైన, భాగ్య మందినభోగం
బమరిన తమిఁదీరదు తర
తమములెఱుంగదు దురాశఁదవిలిమది హరా. ౨౧

కం॥ నను నెవరేమనియనినను
నిను నేన్నమశివయటంచు నెంతు భజింతున్
నినుమానను మననమునా
మనమున ఘనమనుచుఁజేతు మన్నించుహరా. ౨౨

కం॥ పరధన పరదారాధర
భరమధురసుధారలూర వాంఛిలిమునుఁనీ
వరనామామృతపానా
పరవశతానందమొంద బాల్పడను హరా. ౨౩

కం॥ దక్షాధ్వరశిక్షా సుర
పక్షా యక్షీణబలకృపా ప్రకటాక్షా
సాక్షాద్దాక్షాయుని వర
దక్షారుద్రాక్షహారధారుఁడవు హరా. ౨౪

కం॥ అమృతాంధసాదికోపా
యమృతోద్భవమృదుల భావ యనుపమవేషా
అమృతాపంచామృతకృత
యమృతాయమృతాభిషేక యమృతుఁడవుహరా.

కం॥ వరపర్వత రాజసుతా
వరవర్ణిత ధవళగాత్రి వాసవవినుతా
గిరిచాపా హరిరోపా
పరితాపోద్ధరణ పతితపావనుఁడ హరా. ౭౬

కం॥ హితదూరుఁడఁ బతితుఁడ నే
నతిచపలుఁడభక్తి నెట్టులలవనుఁ జూటా
ధృతగంగా భసితాంగా
మృతులింగా నతులొనర్తు మేలెంచు హరా. ౭౭

కం॥ ఉగ్రాగ్ని నేత్ర పరమ వ
రగ్రావసుతాకళత్రి రాజితగాత్రా
నుగ్రహావిగ్రహా మన్మథ
నిగ్రహా యగ్రాసనస్థ నీలగళ హరా. ౭౮

కం॥ విలసితరాణ్మకుటా ని
ర్మలధాతగిరీంద్రకూట మంజులజూటా
దళితారాతినిశాటా
గళసుస్థితకాలకూట గ్రసనుండ హరా. ౭౯

క॥ కుండలి మండలిభూషా
ఖండలశుండాలచంద్ర ఖండాభ్రిఝరీ
డిండీరామృతహారా
మండితయశ ధవళదేహ మదనహర హరా. ౧౦

క॥ అగజాత మేనికాంతియు
నగుమొగముఁ జమత్కృతియును నర్మోక్తులనిఁ
గగనాప గాధరాయో
నగచాపా నిగమరూప నవ్వించు హరా. ౧౧

క॥ వరశరధినిషంగా సం
గర రంగదరాతిభంగ కాంతార్ధాంగా
స్థిరజూటాంతరగంగా
తరుణీనర్మప్రసంగ తత్పరుఁడ హరా. ౧౨

క॥ పురుహూతాద్యమరనుతా
పురహరశుంభత్ప్రతాప పూర్ణకలాపా
గురురూపా గురుదీపా
హరిచాపా పాపహరణ సర్వేశ హరా. ౧౩

క॥ సురనాయక వరదాయక
హరినాయకసర్వలోక నాయకతిలకా
పరశోషా హరిభూష
పరితోషా పరమపురుష పరమేశ హరా. ౧౪

కం॥ భాను ప్రతాపరూపా
మానితవేదస్వరూప బలవదరిదురా
పావన సుగుణకలాపా
మానవవే పాపతాప మహరహము హరా. ౮౫

కం॥ ద్విరదాజిన చేలా భీ
కర కరవరశూల కాలకాలా సుకవీ
శ్వర పాలా సురలోలా
వరశీల కృపాలవాల వందనము హరా. ౮౬

కం॥ పరుఁడవు గురుఁడవు నీవై
స్థిరుఁడైయున్నావు మఱుఁగుదెలసిక నంగా
పరుఁడవో గురుఁడవో హరుఁడవో
మరుగెఱుఁగరాదు మాయ మాయకను హరా.

కం॥ కొండలవంటి యఘంబుల
జెండుటకుఁ భక్తిపరుల జేపట్టుట కొ
క్కండే దేవుఁడనియు న
జాండంబులు వేయునోళ్ళఁజాటునిను హరా. ౮౮

కం॥ నీకంటెంబరదైవము
నాకంటెంబరము పాపినహీనహీ పురభా
మాకంఠ నూత్రిలుంఠన
వైకుంఠార్చితపదాబ్జ భవభీమ హరా. ౮౯

కం॥ దుర్గాధినాథ శాశ్వత
గర్గాదిమునీంద్రవంద్య కరుణాభరణా
భర్గా సంతత విభవ
స్వర్గాద్యపవర్గ ఫల నిసర్గభవ హరా. ౭౦

కం॥ వింటిఁ మహిమ చెవులారఁగ
గంటిఁ భవచ్ఛిద్విలాస కళ గన్నుల నో
టంటా న్నుతివింటా న్ను
క్కంటీశ్వర నీదునామ గాథలను హరా. ౭౧

కం॥ పరమసహస్రారాబ్జాం
తరశశిపీఠస్థుఁడగుటఁ దనుభావుండై
గురుఁడై పరుఁడై స్థిరుఁడై
యరుదై యోగులకుఁగాన నయ్యెదవు హరా. ౭౨

కం॥ రవిచంద్రానలనేత్రా
ప్రవిమలచారిత్రపాత్ర పావనగాత్రా
కవిబుధ మౌనిస్తోత్రా
భవభవవన వీతిహోత్ర పరమేశ హరా. ౭౩

కం॥ నాటుటకు భక్తిబీజము
మీటుటకఘరాజిఁగోట మేలోర్వఁగ నీ
సాటియగు వేల్పు లేఁడని
చాటెదఁ నీజగమునందుఁ సర్వేశ హరా. ౭౪

కం॥ ప్రణవతురీయ సులక్షిత
ప్రణవాత్మక దేవదేవ ప్రణవాకారా
ప్రణవనినాదానందా
ప్రణవస్మరణైకభక్త పరిపాల హరా. ౯౫

కం॥ అలకాధిపునెచ్చెలి పూ
విలుకానికిమిత్తి కొండవీటికి ఱేఁడున్
మలయధ్వజసుత నర్మో
క్తుల కలరేఁడువాఁడవంచు గొల్తునిను హరా. ౯౬

కం॥ ఔరా నెరజాణ యహా
రారా హరి మోహినీవరాంగనఁగని నీ
వౌరా బర్విడితివెయను
గౌరీవచనములకలరు కామేశ హరా. ౯౭

కం॥ డమరుగ్ డడడడ డడడడ
ధమధమధమ ధామ్మటంచు డాపలి కేల్గ
గ్రిమమాలరఁగ మ్రోయించిన
విమలాకారంబుజూడ వేడుకగు హరా, ౯౮

కం॥ జ్ఞానాజ్ఞాన విచక్షణ
నానాతాపోపశమన నతజనశరణా
మానాహత మునిజన స
న్మానా సునుబాణదమన బాణనుత హరా, ౯౯

కం॥ నిటలభసితత్రిపుండ్ర
కటినిఖటితయోగ పట్టికాభుజగేంద్రా
నటదక్షా నిటలాక్షా
ఘటనాఘటచణధురీణ కల్యాణ హరా. ౧౦౦

కం॥ గిరిసుత కిలకిలనగుచో
మురియుచు గిలిగింతలిడుచు ముద్దులగొనుచున్
మరి కొసరి కొసరి మధురా
ధరమధురామృతము గ్రోలుధన్యుఁడవు హరా. ౧౦౧

కం॥ గంగశిరంబున నమయ
ర్ధాంగంబున వెలయఁగని కదాషణ్ముఖ హే
మాంగమయూరం బాడెడు
గంగాజలదములు మించుగముఱంచు హరా. ౧౦౨

కం॥ గిరిసుత యొయ్యారములున్
సురవాహినిహొయలు ప్రమధజోహారులు శ్రీ
ధరముఖ్యుల కైవారము
లరయుచుఁ గైలాసగిరిని నలరెదవు హరా. ౧౦౩

కం॥ నెలరాజున్మౌళి జటా
తలమునగంగయును కర్ణతలములభుజగ
మ్ములును లలాటస్థలిశిఖి
గలగరళము మేనఁగాంతఁ గలవాఁడ హరా. ౧౦౪

కం॥ ప్రోలగును వెండికొండయె
వాలగుముమ్మనయె యద్రివరపుత్రియె నీ
యాలగు నినుసేవించిన
మేలగువేల్పులనునీవె మేలగుటహరా. ౧౦౫

కం॥ సదనహరా సవనహరా
మదనహరా మదనమదన మదవదరి రణో
ర్వీదళనచణ మోహనగిరి
సదనా స్మితవదన యద్రిజారమణ హరా. ౧౦౬

కం॥ నీనామమె పంచాక్షరి
నీనామమెరుద్రసూక్తి నిఖిలాగమముల్
నీనామమె నుతిపాత్రము
నీనామమెచాలుముక్తి నిష్టకును హరా. ౧౦౭

కం॥ మదనజనకాబ్జసంభవు
లెదలోనీమూర్తి నెఱుఁగనేఁగి వివశులై
తుదమొద లెఱుంగనేరని
సుదినమెశివరాత్రిజగతి సోమేశహరా. ౧౦౮

కం॥ ఘనశూలాంకితమౌటన్
దనశ్రీత్సంబుహరికి దత్పాణ్యంభో
ద్ఘనభావన శ్రీకంఠం
డనసలరెండు నీకుభేదమనగలదె హరా. ౧౦౯

కం॥ వనజాస నాదిముఖ్యులు
మనములఁజ్జ్రించిపొగడ భాషావళికిన్
మనముల కగోచరుఁడవఁట
నినునేమని వర్ణనంబు నేఁజేతు హరా. ౧౧౦

కం॥ ఖ్యాతిని నీతినిఁ బాసిన
భూతలనాథులనుగొల్వ బూనుటకంటెన్
రాతినిమెడగట్టుక పెను
నూతనుబడి చావమేలు నుతనామ హరా. ౧౧౧

కం॥ స్వాతంత్ర్యరాజ్యమునకై
వేతంత్రములాచరించి విసిగెడుసుతులన్
బ్రీతింగనిస్వారాజ్యము
నోతండ్రి వేగ మొసఁగి యోముమము హరా.౧౧౨

కం॥ డంబమున నెన్ని యో జ
న్మంబులుజనినన్ స్వరాజ్యమహదైశ్వర్యా
డంబరముఁగలుగఁ దిల శాం
తంబునసాధింపఁగలుగు ధన్యులకు హరా. ౧౧౩

కం॥ నాలోననీవు నేను
న్నీలోనేగలము నేను నీవే నీవే
ఈలోకము లీతేఁడును
నాలోకించినను నేను నయ్యెదము హరా. ౧౧౪

కం॥ ధనధాన్య వస్తువాహన
కనకాంబరదానదాసి కాగేహ సతీ
తనయ సుహృద్బాంధవతను
వనమాన్యక్షేత్రవితతి వశుఁడు జేడుఁ హా రా. ౧౧౯

కం॥ స్తనములుఁ గటి చెక్కులు మో
హనవచ కచనాభి నాసహాస విలాసా
నన నయనశోభన స్త్రీ
తనువుఁ గని భ్రమయనతఁడె ధన్యుండు హా రా.

కం॥ ధర నన్నపర్తిపుర ను
స్థిర విశ్వేశ్వరా పార్వతీసతి విఘ్నే
శ్వరయుత కవి రాడ్జనుమ
ద్వరకవి సంపూజితాచ్యుతారమణ హా రా. ౧౧౽

కం॥ నాతల్లి సర్వమాంబయు
నాతండ్రి శివయ్యశర్మ నా కులదైవం
బాతల్లిదండ్రి నేలిన
యాతల్లియు శివయుతండ్రియా శివుడె హా రా.

కం॥ ధర హనుమత్కవికృతమై
కరకంఠాభరణమగుచుఁ గవిభాస్కరమై
హారకందాష్టోత్తర శత
వరరత్నావళి జగానవర్ధిలుత హా రా. ౧౧౾

కం॥ హారకందాష్టోత్తర శత
మరయుంగా శుక్లవత్స రాషాఢము నఁ
వరపూర్ణిమయుత రవివా
సరమున సంపూర్ణమయ్యె సర్వేశ హరా. ౧౨౦

కం॥ డెందంబుల్ హారవినుతా
నందాష్టోత్తరశతంబు లందలరిచి యీ
కందంబులు జదివినఁ వినఁ
జెందుత వ్రాసినను ముక్తి జీవులకు హరా. ౧౨౧

కం॥ మంగళము జగద్వ్యాపక
మంగళ మగజాత్మ భావభవ భవశంభో
మంగళము సర్వమంగళ
మంగళ సూత్రప్రభావ మంగళము హరా. ౧౨౨

శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము.

విజయ ముద్రాక్షరశాల, బాపట్ల.

# తప్పొప్పుల పట్టిక.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 17 | ఋూపిత | రూపిత |
| 5 | 14 | భ_క్తవళి | భక్తాళి |
| 6 | 6 | జదువను వురా ణములను | జదువను సువురా ణములను |
| 7 | 5 | ఇణిణిణిణిమ్మ | ణిణిణిఃణిణిమ్మ |
| 8 | 15 | రావారా | రావార |
| 11 | 1 | పారద | శారద |
| 11 | 3 | శారద | పారద |
| 12 | 6 | దంత్రవక్త్ర | దంతివక్త్ర |
| 16 | 10 | జూటా | జూట |
| 16 | 11 | ధృత | స్థిత |
| 17 | 19 | హారిభూష | హారిభూషా. |



